సీ. మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు విపులకీర్తి
విస్తీస్ఫారుఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయ ప్రణామంబు లాదరించి
తప్పి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
కొలిచి నిల్చిన యానతి యిచ్చె నాకు.

తిక్కన, తనను గూర్చిగాని, తనపూర్వులనుఁ గూర్చిగాని యీ గ్రంథమునందు విశేషముగాఁ జెప్పుకొనకుండుట కాత్మశ్లాఘనమునం దిష్టము లేకపోవుటయో, పూర్వగ్రంథములయందు వర్ణించియుండి మరల మరలఁ జెప్పుకొనుట రుచింపకయో యైయుండును. ఇప్పటివారికి వలెఁ గాక యానాటి మహాకవులకు, స్వవిషయకథనమం దిష్టముండెడిది కాదు. నన్నయభట్టు తండ్రిపేరైనను గృహనామము నైనను జెప్పుకొనలేదు.

ఇతని గృహనామము: నివాసము:

తిక్కన తన గృహనామము నెచ్చటనుఁ జెప్పుకొని యుండలేదు. కేతనకవి రచించిన దశకుమార చరిత్రమువలన వీరియింటిపేరు కొట్టరువువారని తెలియఁగనగుచున్నది. మొట్టమొదట వీరి గృహనామము గుంటూరువారనియుఁ బిమ్మట కొట్టరువుగా మారెననియు నందురు. తిక్కన పూర్వుల నివాసము గుంటూరుమండలమునందలి

పడుగుపాడనియుఁ గొన్ని తరములయిన పిమ్మట గుంటూరునకువచ్చి యచ్చట నివాసమేర్పరచుకొనిరనియుఁ దిక్కన పితామహుని జీవిత కాలమునందో, కాక యాతని తండ్రులకాలముననో నెల్లూరునకు వచ్చి యట నివాసమేర్పరచుకొని రనియు జెప్పుచున్నారు. తిక్కన నెల్లూరునివాసి యనుట నిర్వివాద విషయము. తండ్రిని గుంటూరు విభుఁడనుటచేత తండ్రినివాసము గుంటూరనియే చెప్పవలెను.

కొన్ని శాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృత శబ్దమునకు దెలుఁగుగ కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లే భాండాగారాధి పతులకు భండారువు అని యుపయోగించియున్నారు. తిక్కనవంశీయు లలోఁ బూర్వు లేనుగురాజులొద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నాకాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లని వాడియుండి రనియు దాని ననుసరించి యీవంశీయులకు "కొట్టరువు" అను నింటి పేరు వచ్చియుండుననియు నూహింపఁదగి యున్నది. ఈ పే రెప్పుడు వచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అన నొక గ్రామ ముండెననియు దానినిబట్టి వీరి గృహనామ మేర్పడెననియుఁ గొందఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువుగ్రామ మెచ్చటనుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కన ప్రశంస:

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించిన దశకుమా ర చరిత్రమునుఁ గృతినందెను. అందుఁ దిక్కనఁగూర్చి యాకేతనకవి రచించిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడనిన
వీఁ డనునాలుకకుఁ దొడవైనవాఁడు

చిత్తనిత్యస్థితశ్రీవుఁ డెవ్వఁడనిన
వీఁ డనుశబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁడనిన
వీఁ డని చెప్పఁబడుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
వీఁ డనిమాపుడు గుఱియైనవాఁడు
ఘనమసిద్ధిని హీశ సమస్తరాజ్య
భాగ్యధారకుఁ డభిరూపభావభవుఁడు
కొండ్రెరువు కొమ్మనామాత్య కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అగు ననఁ గొమ్మనామాత్యతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచాతురివిత మై
నెగడిన వాణోచ్ఛిష్టం
జగత్త్రయం బనిన పలుకు సఫలం బయ్యెన్.

క. కృతులు రచియింప సుకవుల
కృతులొప్పఁ గొనంగ నొరుసికిం దీరునె వా
కృతిసఖుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుఁడు తిక్కఁ డొకనికిఁ దక్కన్.

సీ. సరసకవీంద్రుల పత్రపుటంధము లొప్పఁ
గొను సమధికకీర్తనుఁ డేకవు
లలిత నానాకావ్యములు చెప్పి సభయందు
వలయుందు సముట ప్రశంసత్రోవ
యర్థిమైఁ జెక్కుకళ్ళ సగ్రహారంబులఁ
గా నిచ్చు నసుట పొగడ్తపాలము

మహితశక్తిఁ గాలైన బహువిషయాగంబు
లోనరించు ననుట వ్యసనము దారి
పరువి కొక్కరి కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజముగాఁ బెంపు సొంపార నెగడునట్టి
కొమ్మనామాత్య తిక్కన కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?

ఇతఁడు కేవల మంత్రియే గాక దండాధిపుఁడు కూడ నైనట్లు కేతన రచించిన యీక్రింది పద్యముల వలన స్పష్టమగు చున్నది.

క. శ్రీకరవరకవనాదూ
రీకరణనోదశుభచరిత్రుని ననుకం
పాకరహృదయుఁ గులాబ్ధిసు
ధాకర శుభమూర్తిఁ దిక్కదండాధీశున్.

క. శ్రీవిలసద రమణీయా
భావితభవపాదపద్మ భావనిధానా
భూవినుత శుభచరిత్రా
ధీవిభవా త్తస్వరూప, తిక్కచమూపా.

కేతనకవి రచించిన యీపద్యములలోం దతిశయోక్తి గాని యుత్ప్రేక్ష గాని లేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుఁడగు నీమహామహుఁడు తనవంశమున రాఁబోవువారల కైశ్వర్యము సంపాదించి నిలుపయుంచవలయు నను కోరికకలవాఁడు కాఁడనుట కితని కుమారుఁ డొక చిన్న గ్రామమునకుఁ గరణ మైయుండెనను టయే నిదర్శనము. ఇతఁడు తన శక్తినంతయును ప్రభుకార్యనిర్వహణము నందు వినియోగించి చోడరాజ్యస్థాపనాచార్యుఁ డయ్యెను. తన పాండిత్యమును లోకశ్రేయమునకును, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి నువ

దియోగపరచి, యుద్ధరంగవర్ణనమును గావించుటయేగాక యనేకకవులకుఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు మారనవంటి మహాకవి యీతనికి శిష్యుఁడగుటయు కేతనవంటి పండితకవి కృతిదాత గావుటయు, బద్దెనవంటివాఁ డీతనిచే బిరుదమును గ్రహించుటయు నిందులకుఁ దార్కాణములు.

### హరిహరనాథుని ప్రశంస:

ఇతఁడు పరమభక్తాగ్రేసరుఁడనుట కీతని రచనములే దృష్టాంతములు. ఇతని కాలమున వీరశైవవైష్ణవమతములు పరస్పర ద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడ గావించుకొను స్వభావముతో వెలుగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహానుభావుఁడు శివకేశవుల కభేదమును బ్రతిపాదించి, హరిహరనాథుఁడను దైవమునకు తనభారతమును గృతియిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు, దిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్రహృదయముతోఁ గూర్చుండి రచియించెననియు జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాది యందలి "అవిపూని యాంధ్రకృత్యంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు లోకారాధనవిశేషం బగుటఁ జేసి" అనువాక్యము లీయంశమును ధ్రువపఱచుచున్నవి. ఈకృతిరచన మొకవిధమగు దేవతారాధన మని యే తిక్కన మనసార విశ్వసించెను, ఈతనితరువాతికవులు కొందఱీతని ననుకరించి తమ గ్రంథములను హరిహరనాథునకు గృతిపొసంగిరి. నెల్లూరునం దిప్పు డీయాలయము లేదు. పాండవులయాలయ మొకటి కలదు. ఇప్పుడు రంగనాథస్వామి యాలయమున్నచోటనే పూర్వము హరిహరనాథుని యాలయ ముండెడిదనియు నది శిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించిరనియు జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండుపాయలై చనియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమున నుండెడి

దగియు. నదియొడ్డున పూడిపోయినదనియు, వావాయున దక్షిణపు టొడ్డున హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు దాని శిథిల చిహ్నము లిప్పుడును గన్పడుచున్నవనియు కొంద ఱనియెదరు. బైచ రాజు వెంకటనాథకవి తన పంచతంత్రము నీ హరిహరనాథునకుఁ గృతి యిచ్చియుండుటచే నాతని కాలము వఱకును (పదునైదవశతాబ్ది) యయ్యాల య ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెడిదని ద్రాక్షారామమునందలి యొకశాసనము (పదునొకండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౪౯) వలనఁ దెలియుచున్నది. హరిహరనామక పట్టణమొండు కర్ణాట దేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశంసించుచు తిక్కనరచించిన యీక్రింది శ్లోక మాదేవునకుఁ బరమప్రీతిఁ గల్గించెనఁట!

"కిం నాస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

"ప్రభో! నీవు అలంకరించుకొనుటకో అస్థిమాల నిచ్ఛయింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యము గానుండునా? లేక యశోదాస్తన్యము రుచ్యము గానుండునా నాకుఁ జెప్పుము" ఇది పైశ్లోకార్థము.

భగవంతుడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవుల యభేదమునుఁ బ్రతిపాదించుచు గ్రంథమును రచించినందునకుఁ దననుఁ గొనియాడు చున్నట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిర్వహించుచు
ఖేదము లేక భక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండ వ

త్రాపదవిరంగనప్రకటితస్వభావము కల్మి నాస్మప
ద్మాసనముఁ బొందఁ గావ్యాసనముం గొనియాడుచుండు నెవ్వఁడున్.

స్వప్నసాక్షాత్కారకథను జెప్పిన వారిలో నొకఁడే కాఁడు. తిక్కనసోమయాజి తరువాతివారు పెక్కురితని ననుకరించి తమ గ్రంథములలోఁ దమపూర్వులో, తమ యారాధించిన దేవతలో స్వప్నమునఁ బ్రత్యక్షమైనట్లు వ్రాసికొనుచు వచ్చిరి. కావున నిది యొక యాచారముగాఁ బరిగణించి యట్లు చెప్పికొనియుందురని తలంచినను దిక్కనసోమయాజివంటి ధర్మాగ్రగణ్యున కీస్వప్నసాక్షాత్కారము కల్గె నని యూహించుటయే సమంజసము. పరమహంస రామకృష్ణునకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడిదని చెప్పుటయు నది సత్యమని విశ్వసించుటయు నీయిరువదియవ శతాబ్దియందలి సంగతులు. మానవునకుఁ బరమేశ్వరసాక్షాత్కారము సంభవమని యీకాలమునఁ గొందఱి విశ్వాసము. కాని యది యీ ప్రపంచవిషయము కాఁజాలదు.

హరిహరనాథుఁడు తిక్కన హృదయమున నిర్మించుకొనిన దేవుఁడే కాని విగ్రహస్వరూపుఁడు కాఁడని కొందఱిమతము. అది సత్యము కాదు. హరిహరనాథాలయములు పూర్వకాలమున నచ్చటచ్చట నుండెడివనుటకు శాసనదృష్టాంతములు కలవు. ఆయాలయము నందలి యేకవిగ్రహమున హరిహరరూపములు రెండును గనుపడు నట్లు చెక్కబడియుండెడివని చెప్పుదురు. తూర్పుగోదావరిమండలమున రాజోలుతాలూకాలో కేశవస్వామి యాలయమున నెదుటిప్రక్క కేశవరూపమును వెనుకప్రక్క స్త్రీరూపమును మలచియున్నవి. శ్రీ మహావిష్ణువు మోహినీరూపమున శివుని వంచించినకథను సూచించు టకై యీవిగ్రహమును నిర్మించిరని యచ్చటివారు చెప్పుచుందురు. కావున హరిహరనాథుఁడు కేవలమానసికారాధనకొఱకుఁ గల్పించు

గొనినవాఁడే కాక యార్యాపస్వరూపుఁడుగాఁగూడ నున్నాఁడని విశ్వసింపవచ్చును

తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణమును రచియించు నాఁటికి పూర్వమే తలిదండ్రులిరువురును స్వర్గము నలంకరించియుండి రని చెప్పుదురు దీనినిబట్టి యితఁడు బాల్యమునందే మాతాపితృహీను డయ్యెననియుఁ బెదతండ్రిచేఁ బెంపబడి విద్యల నభ్యసించి సర్వకళల బరిపూర్ణుఁడయ్యెననియు నెంచదగియున్నది.

### తిక్కన యజ్ఞకథ:

తిక్కనామాత్యుఁడు రాజకార్యములలో నిమగ్నుఁడై యున్నను బ్రాహ్మణోచితములగు వైదికకర్మల నుపేక్షింపలేదు. నిర్వచనోత్తర రామాయణగద్యయందు "బుధారాధనవిధేయ తిక్కనామాత్య ధేయ" యనియు, భారతగద్యయందు "బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి" యనియుఁ దెలుపుకొనియుండుటచే నీతఁడు నిర్వచనోత్తరరామాయణ రచనమునకుఁ దరువాతను, భారతరచనకుఁ బూర్వమునను యజ్ఞము చేసెననుట స్పష్టము. కేతనకవి దశకుమారచరిత్రమునఁ దిక్కననువర్ణించుచు "మహితదక్షిణ లైన వివిధయాగంబు లొనరించు ననుట వర్ణనము దాఁగి" యని చెప్పుటచే దశకుమారచరిత్రము గృతినొందుటకుఁ బూర్వమే యితఁడు యజ్ఞమును జేసియుండునని కొందఱనుచున్నారు. అది సత్యమైనచోఁ గేతనకవి యెచ్చటనైనను తిక్కన నామాంకితమున నాతఁడు యజ్ఞకర్త యని సూచించుపదమును వేయకుండ నుండఁడు. అట్టి పద మేదియు దశకుమారచరిత్రమున లేదు. కావున నాయూహయందు సత్యము లేదని తేలవలసియున్నది. కేతన చెప్పినదానికి వైశ్వదేవాదియాగము లని యర్థము చెప్పవలసియుండును. మనుమసిద్ధి చనిపోయినపిదప భారతరచనారంభమునకుఁ బూర్వమితఁడు యజ్ఞము నొనర్చియుండునని నా యభిప్రాయము.

నన్నయభట్టు రచింపగా మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుఁడు ప్రయత్నము చేయుచు, నన్నయ రచనమునందలి తుదిపద్యమగు:

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
ద్దారసమీరసౌరభముఁ దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యనుపద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యిట్లు వ్రాయఁగలిగిన కవు లెవరైన నున్నచో నీభావమును దమశైలిలో రచించి పంపుఁడని రాజాస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగా, దిక్కనసోమయాజి యాపద్యమునే తాటాకుపత్రముపై వ్రాసియిచ్చెననియు, నన్నయతో సమానముగా దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజనరేంద్రుని తనకడకుఁ బంపుమని మనుమసిద్ధిని గోరెననియుఁ దిక్కన యందులకంగీకరింపకపోఁగా మనుమసిద్ధికి గోపము వచ్చి "పలువురిలో నీబుఱ్ఱ గొఱిగించి వీధులవెంటఁ ద్రిప్పి మానమును దీయించెద" నని తూలనాడెననియుఁ దరువాత రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించెననియు నొకకథ చెప్పెదరు. కాని యిందులేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, నూరేగుటయు, సోమపానమును గర్తవ్యములు)

మనుమసిద్ధిమహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలో నున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించెననుటకూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కనయందుల కంగీకరింపకపోఁగాఁ బైనిజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు.

కాని యెందును సత్యము లేదు. తిక్కన భారతమును రచించువాఁటికి, మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భారతమును భగవంతునకుఁ గృతి యీయఁదలఁచినప్పు డందుల కభ్యంతరమును గలుగఁజేయు స్వభావముకలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కనయెడల మనుమసిద్ధికి గౌరవము మెండు. శ్రీకృష్ణదేవరాయలు తన మంత్రియైన తిమ్మరసును "అప్పాజీ" యని పిలచినట్లే మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనలకుఁ గల యన్యోన్యగౌరవము నిర్వచనోత్తర రామాయణము నందలి యీక్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూర్జసత్కవీ
శ్వరులను భక్తిఁగొల్చి తగ వారికృపం గవితావిలాస వి
స్తర మహిమయుఁడైన నను సర్వగుణోత్తమమూర్తి మన్మభూ
వరుఁడు దగంగరాఁబిలిచి వారసిమన్నన నాదరించుచున్,

క. ఏ నిన్ను మామయనియెడు
దీనికిఁ దగ నిత్య భారతీకన్యక నా
కీవగ్వాఁద నగు దనినను
భూనాయకువల్కు చిత్తమున కింపగుడున్.

సీ. సకలలోకప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రవంశమున జనించెననియుఁ
జూచిన మగలైనఁ జొక్కెడునట్టి సౌం
దర్య సంపద సొంపుఁ దాల్చెననియు
జనహృదయానందజనకుఁడై నెగడిన
చతురత కల్మి నప్రతిముఁ డనియు
మెఱసి యొండొంటికి మిగుల శౌర్యత్యాగ
విఖ్యాతికీర్తుల వెలసెననియు

వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమానవిరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుఁ దను సముత్సుకుఁడ నైతి.

మనుమసిద్ధి మహారాజు తిక్కనకు రాజచిహ్నములనిచ్చి గౌరవించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతనకవి చెప్పియున్నాఁడు.

గీ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబగట్లు భూమి గానిక గాఁగఁ బెం
పెసఁగు రాచపదవులెల్ల బడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమవేదియనియు, సరసబహుమానవిరచనాశాలి యనియుఁ జెప్పియున్నాఁడు. అట్టి వాఁడు తిక్కనను బంధుస్త్రీలాదివినరంచుబలుకులు లేమ కావునఁ బైకథ యొంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతిఁ గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయే మొదటివాఁడు. రాజరాజు పరీక్షార్థ మంపిన పద్యము పైని చెప్పినది కాదనియు "నిండుమనంబు" అనుపద్యమనియు కొందఱందురు. మఱియొకటియని యింకఁ గొందఱందురు.

తిక్కనతిరువాతి నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరువదలి పడమట రెండుమూఁడు క్రోసుల దూరములో పినాకినీనదీతీరమునందున్న పాటూరుగ్రామ కరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచుకొనిరనియు నప్పటినుండియు వారు పాటూరివారని పిలువఁబడుచుండిరనియుఁ జెప్పుచున్నారు. ఈవంశావళిని వర్ణించు రెండు సీసపద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్రమున నుదాహరించియున్నారు. ఆ పద్యములివి :

సీ. భారతపర్వము లదిరెండు వరుసగాఁ
దెనిఁగించె గుంటూరితిక్కయజ్వ
యామహాత్ముని పుత్రుఁడౌ కొమ్మనఘనుండు
కల్పించె బాటూరి కరణికంబు
వాకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
[illegible] నతనికి రామన తిప్పన
యాగామనకు సోమయాహ్వయుండు
ఆఘనునకు వీరనామాత్యుఁ డతనికి
సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనాముఁడు [illegible]వీర
ఘనుఁడనంగ సుతులు గలిగి రందు

సీ. సోమమంత్రికిఁ గల్గెసుతుఁడు పావనమంత్రి
యతనికి వీరన యాఘనునకుఁ
గూరిమి తనయులు గోపాలభద్రార్య
నరసింహమంత్రు లనంగ మువురు
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁడనఁ బుత్రులు గలిగిరి మువ్వురు
వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేఙ్కనామంత్రికి
శరభమంత్రివరుఁడు జనన మొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్ధిలంగఁ గొమరు మీఱ.

ఇందులో మొదటిపద్యము పూర్వరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగనాథశాస్త్రిగారు రచియించి రనియుఁ జెప్పుచు నీపద్యములను శరభరాజుగారు వీరేశలింగముపంతులు గారి కిచ్చిరఁట. పాటూరి కరణికమునబట్టి వీరు పాటూరి వారైనారఁట.

కొందఱీవంశావళిని గూర్చి సంశయమును దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపుబర చాలకాలము వీరి యింట నుండెననియు నందుపై నొకప్రక్క సరస్వతి విగ్రహమును నొకప్రక్క విఘ్నేశ్వర విగ్రహమును జెక్కఁబడియున్నవనియు బ్రతీతి కలదు. అది యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్రం. శ్రీ వీరేశలింగముపంతులుగారీ వంశావళినిబట్టి తిక్కన కాలము నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసనసాహాయ్యమున నీమహాకవి కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నందుల నీవంశావళికిఁ బలము లేదు. మడికిసింగనకుఁ బితామహుఁడైన యల్లాడమంత్రి తిక్కనసోమయాజి పౌత్రిని బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడి యున్నది.

ఆంధ్రభాషకీతఁడొనర్చిన సేవ:

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యగ్రేసరుఁడు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారి కావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పముగను నున్నవి. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు మొదలగు శివకవులు తమ గ్రంథములలో దేశీయపదముల నధికముగ నుపయోగించి యాంధ్ర సాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడి యుండిరి. తిక్కనసోమయాజి రెండు గ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో

దేశీయపదములను జక్కఁగా సంస్కరించి యుపయోగించి, తన రచనముల నాంధ్రసాహిత్య గ్రంథములనుగాఁ జేసెను. ఆంధ్రాభ్యుదయ రచయితలలోఁ దిక్కన యగ్రగణ్యుఁడని చెప్పనొప్పును. ఆంధ్రసాహిత్య పోషణమున కీతఁడు పడినశ్రమ యపారము. ఈతనిరచనములు రెండును సంస్కృతమున కాంధ్రీకరణములైనను, ఇతఁడు గొప్పసంస్కృతపండితుఁడైనను, నీతని కవిత్వమునందుఁ "నన్నుపయోగింపుఁడు నన్ను కొనుఁ"డని సంస్కృతపదములు ముందునకువచ్చి యుఱ్ఱూతలూగించుచున్నను, నాంధ్రభాషాభివృద్ధినే మనమున నిడుకొని విశేషముగా జాతీయపదములనే యుపయోగించి, రసముప్పతిల్లునట్లు కావ్యరచన సాగించినవాఁ డీమహాకవి. ఈతని కవిత్వమునందు సంస్కృతపదములున్నను నవి యతిమృదులములై సారూప్యముల వాడుకొనుచుండుటచే "ఏవి సంస్కృతపదములా? జాతీయములా?" యని సంశయము గల్గించునట్టివియై యున్నవి. ఈతఁడు తన రచనావిధానమును సూచించుచు నిర్వచనోత్తర రామాయణమున:

ఉ. జాత్యముగాని నొప్పయినసంస్కృత మెయ్యెడఁ జొప్పు; వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్యములోనిఁగఁ జెప్పనెట్టి; దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము వరింపను వేఱగునక్షరంబులన్
బ్రత్యయరూప మంచు నిడ; సూరుల కిద్ధ యింపుఁ బెంపదే.

అనుపద్యమును జెప్పి యారీతిగనే తన కావ్యములను విరచించినవాఁడు. ఈసందర్భమునఁ దిక్కన కవిత్వపుసొంపు సూపుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుట యావశ్యకము కాకపోదు.

ఉ. నన్నుఁ బరాభవించి పదనంబునఁ దాఁచిన కీచకుండు మా
మ్మన్నన తెలుఁగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్న మొగుడ్పుమాటలకుఁ గారణమెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా! (వి.వ)

క. ఆపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పుమయా
శ్రీపుష్పవనకుఁ బాంతు
తెప్పగాలుఁడు నిన్నుఁజూపి చనియెం మహాత్మా!

ఆ. కౌతుకుఁగాంచు రాచకూఁతు రైద్వాసకి
నట్టువికి నుచిత వైవసమయ
యొనవెఁ దడయ దింకనొప్పదు జనములు    ఉ. ప.
నట్లుగాని వృషము లనరు మిమ్ము

తే. వట్టపగలింటిసూర్యునిపగిదిఁ గణ్ణఁ
దుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మాధవా! మాఁ రథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు బడయవచ్చు.    క. ప.

చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూపదు
స్తర భుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడగించి యివ్వసుం
ధరఁ గొనునొక్క నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపునొకొ శల్యుఁడు కౌరవరాజనందనుఁ (శ. ప)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుడుం గృతఘ్నుఁ [డున్
నేరనివాఁడు బొంకరియు నిందకునోర్చునతండుఁ బింకయుం
ధీరత లేమి దుర్ణయ మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ జెట్టయొనర్చు నరేశ్వరోత్తమా! (శాంప)

సీ. దివియలోఁ బడుఁబుర్వు దివియనొత్తినవానిఁ
శాపంబు వొందునే! యోపి దున్ను
నాఁగేటిమొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁబొందునే యఘము? వాసు

దమునను శ్రేయో విధాతృవశమున నా
యువు దెగినట్టిజంతువులు సచ్చు
నేము సంపితి మని యించుకేని యు సహం
కారంబు వారికిఁ గలుగ దట్లు

ఆ. గాన చూచె వారిఁ గల్మష మొందదు
పుణ్యపాపములకు బుద్ధి మూల
మని యెఱింగి యుండు మాత్మ యు నహింసవోలె నై
యాదిధర్మ మైనవిధము వినుము. ఆ. వ.

ఉ. ఏను హితంబు సెప్ప విడు లేని దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోఁగి చేఁద యనమందు పథ్యం దొపు లంబుఁదా కినం
గాని రుజాంగముం దఱచు వంతి కారణము గల్గునె యట్లపోలె నీ
దైన నికృష్టవృత్తిఫల మంది తలంచెదు గాక పిమ్మటన్. ని. రా.

స్థాలీపులాకన్యాయముగ నీపద్యములఁ జూపితిని. గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనిఁ జూచి కేతనమారనాదు లిట్లే తమ గ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచు వచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొందఱీమార్గమును విడనాడి తమ కావ్యములను సంస్కృత పదజాలములతో నింపివైచిరి. సాంస్కృతిక దీర్ఘసమాసములతో గ్రంథములను రచించుటయే గొప్పతనమని తలంచినకవులు కూడఁ గొందఱు గలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనము సేయఁదలఁచికొనినప్పుడు దేశీయపదములతోఁ బాలకలోకమునకును వినువారికిని హృదయాహ్లాదమును గలుగఁజేయునట్లు రచియించుటయే గొప్పతనమగును గాని నిఘంటుసాహాయ్య మందినఁగాని యర్థముకాని గూఢసంస్కృత పద సమాసములతో నాంధ్రకావ్యమును రచించుట గొప్పతనము కాఁ జాలదు. ఈసందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తెలుఁగుఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రిమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే.

ఆ. తెనుఁగుబాస నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థమెల్ల దోఁపకున్న
గూఢశబ్దతతి కొల్లలవని రొల్ల
మూఁగ చెవుడు నాడు ముచ్చటగును

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పునది తెనుఁగునకున్
బొందై రుచియై వీనుల
విందై మతి శోభించు విబుధుల కెల్లన్.

అను పద్యములు స్ఫురణకు వచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథములయందు ప్రయోగించిన దేశీయపదములు వేలకొలఁదిగ నున్నవి. సంస్కృతపదముల విషయమున "ప్రాజ్ఞో ప్పిష్టా జగన్నుయా" మ్మనెడు మాట దేశీయపదవిషయమున నీమహాకవికి వర్తించు ననుటకు సంశయము లేదు. ఈభావమును దశకుమారచరిత్రకృతికర్తయగు కేతన కవి "అగునన గొమ్మ నతిక్కఁడు" (ఈపద్యమును పైన దాహరించితిని.) అనుపద్యములో వ్యక్తీకరించి యున్నాఁడు.

ఇతని కవిత్వగుణము :

అద్వితీయ ప్రతిభావంతుఁ డగు నీమహాపురుషుని కవిత్వగుణమును జూపనెంచుట సూర్యుని కాగడాలోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్రకవులలో నీతనితో సమానులింకొకరు లేరు. ఈతనికవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది:— ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు. ఆర్యులమగు మనకుఁ గల యితిహాసములలో శ్రేష్ఠములయినవి రెండు. భారతము, రామాయణము. ఈకావ్యములు రెండింటి నీతఁడు చేపట్టినాఁడు. "మణినావలయమ్ వలయేన మణి" యనునట్లు కవిత వలన కథయునుఁ గథచేఁ గవితయు శోభకెక్కును. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదితమగుటచేఁ గాఁబోలు నీకావ్యముల యందలి యితివృత్తములే తన కవితాశక్తిని ప్రదర్శించుటకుఁ దగిన కథ లీతనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:— పదసౌష్ఠవము ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్న చిన్న దేశ్యపదములని విశేషముగా నీతఁ డుపయోగించును. ఏతావున నేపద ముపయోగించిన రస మవ్వతిల్లునో యీతనిచందువలన బాగుగాఁ దెలియును. ఎచ్చటనైన సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపద సంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటు పుస్తకముల యక్కర యుండదు.

మూఁడవది:— అర్థగాంభీర్యము. ఎంతచిన్న పదముల నుపయోగించినను వానియందెంతయో గాంభీర్యమగు నర్థ మిమిడియుండును. పాఠకుని శక్తికొలఁది నంతటి భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:— వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును దెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనైన స్వల్పముగా నట్టి పదము లున్నను నవి కేవలము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తూకమును దెలుపునవిగానే యుండును.

ఐదవది:— పాత్రౌచిత్యము. కవిత్వ మెంతరసవంతముగ నున్నను, పాత్ర పోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలు

గదు. భారతమున ప్రధానపాత్రములు రెండు ధర్మరాజును, ద్రౌపదియు. తిక్కన నీయిరువురను భారతమున నదికంటెఁ జక్కగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసునికంటె నీతనిదే పై చెయ్యియైనది. ధర్మరాజుకు రాజనీతిజ్ఞత, సమయోచితజ్ఞానము కార్యదీక్ష, ఇంద్రియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణములను జూపుచు తిక్కన వ్రాసిన భాగముల నొక్కచోఁ జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలు కలుగునని నాయభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుగూడ నీతఁడు చక్కగా పరివర్ణించినాఁడు.

ఆఱవది:— భావప్రకటనము. తాను చెప్పఁదలచుకొనిన భావము పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్నచిన్న మాటలతో వ్రాయు నేర్పి కవిశేఖరున కలవడినట్లింకొకరి కలవడలేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమున నున్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లేయుండి పాఠకునకెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికున కట్టిసందర్భములలో వాభావమును దనమాటలతో శ్రోతలకు విప్పి చెప్పుట కవకాశము కలుగుచుండును. ఎంతటి కఠినవిషయము నైనను చిన్నమాటలతో సులభముగా బోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగుల నిపుణుఁడు.

ఏడవది:— రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములును పాఠకుఁ డనుభవించుటకుఁ దగిన యితివృత్తమును గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లు పదముల నుపయోగించుట యందును రసపోషణమునందును నీతనికిఁ గల శక్తి యపారము.

ఎనిమిదవది:— లోకజ్ఞానప్రదర్శనము. ఈ మహానుభావుఁడు కేవల పండితుఁడునుఁ గవియు నే గాక లోకజ్ఞానమెఱింగిన మహామేధావి.

శాస్త్రముల యందును గ్రంథముల యందును జెప్పఁబడినదియే గాక నిత్యమును ప్రపంచమున జరుగుచున్న విషయములను గ్రహించి యందలి మానవ చేష్టల నెఱిఁగి లోకజ్ఞానమును గాంచి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁడీతఁడు.

ఈ కారణములచే నీతని కవిత్వము పండితపామర జనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథమగును.

ఈతని యాంధ్రీకరణ విధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగ పర్వములలో మూలమందలి కథను మార్గము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యము కొఱకును రసపోషణము కొఱకును చాలమార్పులఁ గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకును నెక్కువయాహ్లాదమును గలిగించినవి, విరాటోద్యోగ పర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గనుపఱచి, యీ రెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణ విధానమునుఁ జూపుటకై యీపర్వములనుండియే దృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవనున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితో నుడివిన వాక్యములను, సంస్కృతభారతము నుండియు, తిక్కనభారతమునుండియు నెత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్యసహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువాచేదం మనస్వినీ."
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథానికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజ్ఞా మంత్రం రహసి శ్రావితః"
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా."
"పంచనస్తాత దీయంతాం గ్రామా ఇతి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్."
"అవసానం మహాబాహో కంచిదేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనో వాచ్య స్సుహృదశ్చాస్య కేశవ"
"నచాపి వ్యాకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ హ్రీమత స్సంధి మిచ్ఛతః"
"అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః
సంధి మిచ్ఛేన్న కర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా నదానేన శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మాత్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేనవా కృష్ణ యేన శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా."
"తస్మాత్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయాచైవ మహాబాహో పాండవై స్సహసృంజయైః"

"ఏతత్సమం ధర్మం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్రియమాణం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహమ్"
క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియోవా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా"
"అన్యత్ర బ్రాహ్మణా త్తాత సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్" |
"యథా ఒవధ్యే భవే ద్దోషో వధ్యమానే జనార్దన
సవధ్య స్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః"
"యథా త్వాం నస్పృశే దేష దోషః కృష్ణ తథా కురు,
పాండవైః స్సహ దాశార్హ సృంజయైస్సహ సైనికైః"
"పునరుక్తంచ వక్ష్యామి విస్రబ్ధేన జనార్దన,
కానుసీమంతినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ"
"సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యా త్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియాసఖీ"
"ఆజమీఢ కులంప్రాప్తా స్నుషా పాండో ర్మహాత్మనః
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్."
"సుతా మే పంచభి ర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః"
"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ."
"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలే ష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా."
"నిరమర్షే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషుపాండుషు
పాహి మా మితి గోవింద మనసా చింతితో ఒసిమే."

"యత్రమాం భగవాన్ బ్రహ్మా, శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి వారార్హాసి మతాసి మే."
"అదాసాః పాండవా స్సంతు సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ."
"ఏవంవిధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతి బాంధవామ్."
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్."
"ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్తమపి జీవతి"
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపామయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః సర్వః కృష్ణ విధీయతామ్."
వైశంపాయనః,
"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్."
"సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్యసవ్యేన పాణినా."
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా ద్విరా కృష్ణం వచన మబ్రవీత్"
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వకాలేషు పరేషాం సంధి మిచ్ఛతామ్"
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికామకౌ.
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రై ర్మహారథైః"
"పంచచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ"

"దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితమ్,
యద్యహంతు నపశ్యామి కా శాంతిః హృదయస్య మే."
"త్రయోదశహి వర్షాణి ప్రతీక్షంత్యా గతాని మే,
నిధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్"
"విదీర్యతే మే హృదయం భీమవాక్ఛల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహు ర్ధర్మమే వానుపశ్యతి."
"ఇత్యుక్త్వా బాష్పసంఘేన కంఠేనాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కంపం సస్వనం బాష్పగద్గదమ్."
"స్తనౌ పీనాయతశ్రోణీసహితా వభివర్షతీ,
ద్రవీభూత మివాత్యుష్ణం ముంచతీ వారి నేత్రజమ్."

ఈ శ్లోకములయర్థము సులభగ్రాహ్యములగుటను, గ్రంథవిస్తరభీతిచేతను వీనికిఁ దెలుఁగు వ్రాయలేదు.

గీ. ధర్మనందనుపలుకులు దనదు హృదయ
తాప మొదవింప మోమున దైన్య మొంద
నన్న పాంచాలి యిట్లని యొయ్యఁబలికె
గనలి శోకంబు గద్గదకంఠి యగుచు.

ఉ. అంతలుచేసి పోనడచి యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? యిట్టియాఱడి మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా
నంతవ యూరు లేవుఁడె? నైదు సుయోధను డిచ్చునొక్కొ? ఈ
కంతకృపావిహీనమతి నాతఁడు నోచునె యన్నదమ్ములన్!

చ. తనమనుపడ్డ బన్నములఁ దమ్ములనిప్పుడుఁ గంటూర్మి పేర్మి నీ
జనపతి సైపనున్నె? యదిసక్కన? రాజ్యముపాలు లేక తీ
ఱన కొదబాటు గల్గిన, నెఱుంగమి పెట్టరె? చాలరైరి వీ
రనరో కోపానలేమి యని యారసరె లోకమువారు కేశవా?

శా పెంపేదం దమకోట్లితక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపంగా వారికేలు సంధి తిమువారిం జూచినం దారు సా
ధింపంజాలరొ? కాక పోరఁ దగమర్ధ్యంబు దలఁపేని శం
కింపం బట్టరొకో? వారు ప్రాభవ్యాణులె? యేకీడైన సైరింపఁగన్.

ఉ ఓట మొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యొక్కడుపూనుగాక, యు
చ్ఛోటన సంగరంబు లగుచొప్పులు పుట్టినకైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకో? పోదురొ? కానననుండ నచ్యుతా!

ఉ ఏటుటంటి నావలన దింకను నీవును రాజధర్మ్మలం
గానుచితంబు సూచి మునకార్యము, మీసుజనత్వముం జెడం
గా నొంకభంగిసేయక తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెలుంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పులేర్పడన్

ఉ ఆలసిలోకముగా, ఫలము నందుటయుగా, గని పక్కనేరమిగా
మాలనొరిదానయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాటుంబు ప్రేలెదర వినుఁడు, కర్ణము నెగ్గుము గాన సల్కమై
వీటికి సైనమానిసికి వెండి వివేకము గల్గనెర్చునే.

చ వరమునఁ బట్టితిరా, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీలవిక్రమ
స్థిగు లగుపుత్రులం బడసితిన్, పరాజన్మల ప్రావుఁగాంచితిగా
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తి నెక్కినదాన నెంతయుగా.

వ అట్లుంగాక,

ఉ నీవు సుభద్రకంటె గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు; దట్టినను బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథ బునందు శుచియై పెనుపొందినవేణి పట్టి యీ
దుపురుఁ జూడఁగా సభను నీడ్చె! కులాంగన లిట్లొనర్తురే?

ఉ. ఆసభ కౌరవస్త్రీ యగుటెట్టి వనంబుగా వివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రితుల యాకృతినున్నయెడఁ, ముకుందః ని
శ్శ్వాసములోడ నన్ గొలువవచ్చు మనం బదియుం దలంపవే?

చ. అరయఁగ మిఁజేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నన్నపా
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీరలలోన నొకఁడు ఈ
శ్వరుఁ జని కోలగంబు దగఁ జేయుదునో? అటుగాక పాడియై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ సెప్పుయింపుమా!

వ. అని యట్టుగ్గడించి,

ఉ. ద్రౌపది బంధురంబయిన క్రొమ్ముడిఁ గ్రమ్మనవిచ్చి వెండ్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నాఁ బలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు మహాపరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ డగ్గుతి యార్తయై.

క. ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్వపోయె దక్కినయవి కౌ
రవుల కడ దీర్చు మాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! కృపఁగా.

సీ. ఈ వెండ్రుకలు పట్టియీడ్చిన యాచేయి
దొలుతగాఁ బొరిగొని దుస్ససేను
తను వింతలింతలు తునియలై యెదురు రూ
పఱియున్నఁ గనియెదఁ గాక
యలుపాలఁ బొనుపడునట్టి బిచ్చ ఇది?
పెనుగదఁ బట్టిన భీమసేను
బాహుబలంబును బొలించి గాండీవ
మును నొక విల్లెప్పుడును వహించు

ఆ. క్షత్త్రియకర్మంబుఁ గాల్పనే? యిట్లు
భిన్నములు వడిన ధర్మనందనులకు
నేను రాజరాజపీఠముం గన్నారఁ
గానఁబడయ మైత్రి మేలెఁ గృష్ణ?

ఉ. నెట్టన యిట్టియుల్క మదినిల్పితి రక్కసతాల్మిఁ జొప్పడం
గట్టినయట్లు వర్ధనయును గాలము దీనికి వాలు వెన్నడుల్
బుట్టదు దుష్టవిగ్రహము పూని జగంబులు గాఁచు నటితో
బుట్టవు నీవు, తేజమునఁ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

వ. అనుచు నెలుఁగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను, బెన్నతివేణి ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో నిట్లనియె."

పై శ్లోకములను బద్యములను జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నె పెట్టినదని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కో. లక్ష్మణరావుపంతులుగారు వ్రాసిన వాక్యముల నుదాహరించెదను. "తిక్కనకృతిభారతము సంస్కృతమహా భారతమునకు భాషాంతరీకరణ మని మనవారందఱు అనుకొనుచున్నారు; కాని యది గొప్పపొరపాటు ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొకయపరాధము సేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారతమా ముద్దలోనుండి కావలసినంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కనిసువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే మాయుద్దేశము" విరాటోద్యోగ పర్వములందక్క తక్కినభాగమును దిక్కన క్లుప్తము చేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చినప్పుడు మహారాణులు కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొనుచుండెడివారని యీకథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టిసంప్రదాయము పురాణయుగములో నేకాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునొకండవ శతాబ్దిప్రాంతమున మనదేశముపైకి దండెత్తి వచ్చిన మహమ్మదీయులకు సాహాయ్య మొనర్చుచున్న జయచంద్రమహారాజుపై యుద్ధముచేయఁ బోవుచు నాతనియల్లుఁ డగు పృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చెననియు, పృథ్వీరాజు యాజ్ఞానుసారముగ నాతని రాణియు జయచంద్రుని తనయయు నగు సంయుక్తాదేవి యాసభకువచ్చి సమరతంత్రములలోఁ బాల్గొని దేశము సంరక్షణమునకై జయచంద్రునితోఁ బోరుసల్పుట యుచితమే యనియు నందుఁ దండ్రి ప్రాణములు పోయినను దానందులకుఁ జింతింపననియుఁ దెల్పి భర్త ప్రతిజ్ఞకును దోడుపడియెననియు, నప్పుడాసభయందున్న చాందాభట్టుఅనుమహాకవి 'పృథ్వీరాయరాసా' యనుగ్రంథమున వ్రాసి యున్నాఁడు

### తిక్కనమహాకవి రచించిన కావ్యములు :

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మనకిప్పుడు లభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తర రామాయణము. రెండవది శ్రీమహాభారతము.

### నిర్వచనోత్తర రామాయణము

ఇది వాల్మీకిరామాయణములో సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁ డయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగువఱకును జరిగినకథకుఁ బూర్వరామాయణమని పేరు. ఇది

యాఱుకాండలుకలదు. ఈయాఱుకాండములలోను జెప్పని రావణ జననాది పూర్వవృత్తాంతమును శ్రీరామపట్టాభిషేకానంతర సీతావనవాస కథయు కుశలవ జననాది కథలును నేడవకాండమున నున్నవి దీని కుత్తరరామాయణమని పేరు. దీని నీ యుభయకవిమిత్రుఁడు తెనిగించె ను గ్రంథమం దెచ్చటను వచనము లేకుండ రచియించుటం జేసి దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణము గాఁ గథాసందర్భమును గలుపు పట్టులయందును, వర్ణనలను జేయుపట్టు లను వచనములను రచియించుచుందురు. అట్టివి లేకుండ నాభాగము లను గూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభి ప్రాయమును దిక్కన యీక్రింది పద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపఁగఁ గొంతవన్నెఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పుటార్య లొప్పిద మనరే?

క. లలితపదవ్యాసక్తిప్రసక్తం
బులఁ గథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలుగా
పూల సంధించిన విధంబు నమరఁగవలయున్.

ఇతఁడు పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణ మును దెలిఁగించుటకు గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణ మును భాస్కరుఁ డాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామా యణమును రచించిన దీతని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొందఱనుచున్నారు. ఈసందర్భమునఁ దిక్కన రచించిన కొన్నిపద్య ముల నుదాహరించుచు వానిఁగూర్చియు, భాస్కరరామాయణ కర్తృ త్వమును గూర్చియు మంత్రి భాస్కరుని చారిత్రమున విపులముగాఁ

బదునేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

అను పద్యములనుబట్టి యారణ్యపర్వము నన్నయభట్టు పూర్తి గనే రచించినట్లు కన్పట్టుచున్నది కాని సాక్ష్యమిందులకు వ్యతిరేకము గా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రగ్గడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆంధ్రలోకాభ్యుదయమును గాంక్షించి, ఈమహాభారతవిరాణ్మా కార్యమునకుఁ దాను సంసిద్ధుఁడనైతినని యీకవిసార్వభౌముఁ డీక్రింది పద్యములోఁ జెప్పియున్నాడు.

"ఈ శాసన భారతాన్వగము కర్ణపుటంబుల వారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదమందఁ బొరయున్నట్లుగ శాత్యవతేయ సంస్కృతి
శ్రీభవాస్పదంబయిన చిత్తములోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్"

పరిశాంతహృదయముతో భారతరచనమునకు దీక్షఁ గైకొనిన యీ పుణ్యపురుషుఁడు తెలుఁగుభాషలో భారతమును రచియించుట "పురుషార్థతరుపక్వఫల"మని హరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యీక్రిందిపద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యనికృతి యయి
భారతమను పేరఁ బరగుపంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

తే. తెనుఁగుబాస విరచింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెనసి యక్కొని వేడ్క నూని కృతిప
తిత్వ మొప్పించి వచ్చితిఁ దిక్కశర్మ!

ఆంధ్రభాషలో ప్రాశస్త్యము లగు కావ్యములను రచించినవారిలో తిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతేకాదు, పరిమాణము నందుఁగూడ నీతనితో సమానముగ గ్రంథరచనము గావించిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తర రామాయణమున దాదాపు 1300 పద్యములును, మహాభారతమునఁ బదునాఱువేల గద్యపద్యములును గలవు. ఈతని రచనములయం దేభాగమును దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయు ననియే యుత్సాహము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము

కందపద్యరచనమునం దీతఁడు కడు నేర్పరి. మన దేశమున "పందిని బొడిచినవాఁడు బంటు, కందము చేసినవాఁడు కవి" యను లోకనానుడి కలదు. కందపద్యములను రచించుట కష్టతరమని దీని యభిప్రాయము. కవిచౌడప్ప చెప్పిన:

"క. ముందుగఁ జను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁ డందురు సే
డింకను నను ఘనుఁ డందురు
కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా"

అను పద్యమునుబట్టి పూర్వకాలములోఁ దిక్కనసోమయాజి కందములు మతి కెక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను సరసముగా రచియించుటే కాక సంఖ్యయందుఁగూడ వాని నధికముగా వ్రాసి యున్నాఁడు. దాదాపు 1300 పద్యములుగల నిర్వచనోత్తర రామాయణములో నైదువందల యిరువదిరెండు కందములున్నవి. భారతమునందలి మొత్తము గద్యపద్యములు పదునాఱువేలలోను మూఁడవభాగ మయిదువేల మూఁడువందలు కందపద్యములు. భాస్కరరామాయణము

న మల్లికార్జునభట్టు రచించిన భాగములోఁ గూడ మాటికి నలువదికి మించి కందపద్యములు కలవు. మల్లికార్జునభట్టు పేరఁగల భాగములోఁ గాలభాగము మంత్రిభాస్కరుఁడు రచించెనని యొకవాదము కలదు. ఆ వాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమఁడును, శూరులును మంత్రులు, నగుటయందే కాక, కందపద్యరచనమునఁ గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదితమగును. విరాటపర్వాదియందుఁ దిక్కన దక్కినప్రతియోగ్యపాదియందును దిక్కన కందపద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాదిపద్యములనే గాని, కవిరాజవిరాజితాది వృత్తములను రచియించుటలో నేర్పరి కాఁడని యెవ్వరో యాక్షేపింపగా స్త్రీపర్వమునఁ గష్టపడి యాతఁడు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున వట్టివృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీఁదట వానిని రచించెననుట సత్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను బల్కుచుండుటగాననగును ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతఁడు రచియించి యుండును. చంపకోత్పలములు గాని, మత్తేభశార్దూలములు గాని, స్త్రీపర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందుఁ గలవు.

ఈతఁడు రచియించిన రెండుకావ్యములలోను, నిర్వచనోత్తరరామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారితేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమునఁ గొన్ని తావులలో నీరసకవిత్వము నారికేళపాకములో నున్నదని కొందఱందురు. కాని యది సత్యము కాదు.

ఈతని కవిత్వశైలి చూపుటకిదివఱ కుదాహరింపఁబడిన పద్యములే చాలియున్నవి. ఈతని పద్యములన్నియు, రసవంతములై యుండును. అట్టివానిలో మంచివని యేరియేర్పుట యసంభవము. అయినను, రామాయణమునుండి యాశ్వాసమున కొకటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొకటిచొప్పున పదునెనిమిదిపద్యముల నీదిగువ నుదాహరించుచున్నాఁడను. మెచ్చుచూపులలో మంచిచెడ్డలు రెండిటినిగూడఁ జూపుట ధర్మముకదా.

నిర్వచనోత్తర రామాయణము:

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగ జాలిన సీతకు రుద్రచాపభం
జన మనునంకు విచ్చి నృపసత్తమసూతిఁ బరిగ్రహించి పె
ర్చిన యుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచున్. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగు మాల్యవంతుఁ డ
చ్చెరువగు విక్రమంబునఁ బ్రసిద్ధివహించి నిజానుజన్మలం
గర మనురక్తి నున్నన్ దగం గొనియాడుచు సర్వలోకభీ
కరుఁడయి దేవతామునినికాయము దల్లడమందుచుండగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముల్
గొనుచెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
మను వగునంతకున్ రిపుఁ డగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగ బొంకక గడంగుము నీభుజదర్ప మేర్పడన్. ఆ౩

శా. కేలీకందుకవల్లి నెత్తుకొను మాడ్కిం బట్టి నాయున్న యీ
కైలాసాచల మిట్టి నీవు సొలయంగా నెత్తితం జోద్యమై
లీలా వేఁగొనియాడు ఱెల్లరును వర్ణింపంగ నీకొక్క పే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపేర్పడంగ నేనిచ్చెదన్. ఆ౪

చ. పరమపతివ్రతావిభవ భాసురలీల వెలుంగుచున్న ని
ష్కరుణతి నిర్మలాంబతి చేఁ గావున నీవనుజాధముండు స
త్పురుషపరిగ్రహం బయిన పుణ్యసతిం గలుషింపఁ జేసి త
ద్వరుని పరాక్రమంబున నశక్యము మృత్యువుఁ బొందుఁ గావునన్. ౮౫

ఉ. వంచిన కెంపుఁ బాసిదివిఁ బ్రాకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు సేసి కుముదంబులఁ బిందువు సేయఁ బంచి యా
జ్ఞంబుల నిద్ర వుచ్చి మరుసాయకముల్ గరసానఁ బట్టి కో
కంబుల నేఁచి లోకము పొగడ్తలు సేకొని చంద్రుఁ డున్నతన్. ౮౬

శా. వాలిం గీటియు వాయుపుత్త్రు సరియే వాఁ డాత్మకీర్తిజ్ఞుడై
యాలోకంబులు గెల్తు నే నవిర మా కొందుం గలండే మహీ
పాలాగేసర వానివర్తనముఁ జెప్పం జిట్ట లాపిక్రియ
శ్రీలో లున్ భవదీయసన్నిధిఁ బ్రశంసింపంగుం జెప్పదగన్. ౮౭

ఉ. రావణు నింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్టమని పల్కిరి చూచితే లక్ష్మణా? మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయోధ్యదం
బావకుఁ డిచ్చె నా సతిఁ బాపపుమాటలు పుట్టె నయోధ్యదన్. ౮౮

మ. ఒకనారీతిలకంబు గాననములో నుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలును బద్ధ్వరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనయున్ వికీర్ణకబరీభారంబు వక్త్రాబ్జశో
షకనిశ్వాసగమోహ్మముం గలుగ విస్తుం బొందఁగా నయ్యెడన్. ౮౯

చ. జయజయశబ్దముల్ సెలఁగ సర్వజనంబు నెలర్ప నిర్మలిం
బియసుత యుగ్మముం డిగిచి పెద్దయుఁ బ్రొద్దోకఁ గౌఁగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి దమ్ముల నమ్మిఁ మొందఁ జేసి య
వ్యయపదవృద్ధి తిల్లుల మనం బలరం బ్రకటించి వేడుకన్. ౯౦

మహాభారతము :

ఉ. ఈతఁ డరాతిశత్రుఁడు సాహిం దగ దిగ్విజయంబు సేసి వి
ద్యాతిశయార్థి వాసవు మహాతన మైనను నెక్కె నక్కఁడు
ద్ద్యోతితమూర్తి కౌంతకులోద్వహుఁ డాగ్నిసికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీ చిరతరోద్ధరణుం దగఁడే నరేశ్వరా. వి. ప.

మ. తుది రాజ్యమ్మపగమ్మ గొన్నఁడవియందుం జేరు వందించియుం
బదమూఁడేఁడులు నీవుసుం దిరిగి రా పాలింప వచ్చెనే
యది గాదేఁ దెగి బంట్లవై యిటులు సుమాయ ల్పమ్ము నేర్పింక చె
ల్లదుసూ పీకని యాసుయోధను యుల్ల బుచ్చెనో వాడు మా ఉ.ప.

ఉ. కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్లనుం
దేవవుగా నీ వీటుం ధీరతఁ బూనికి దప్పునం బ్రతి
జ్ఞాపరుఁ డైన ధర్మసుతు శాంతము ధైర్యము బాహువీర్యముం
రూపటకి పోక కాదె యన రూపమె నీ కిది లోకనాయకా. భీ.ప.

చ. వినుము కిరీటి! దివ్యశరవేఏలి వాఁడను దేవ లేశచో
ఁ ను మును సెల్లి శిశు నిటలం జనకిత్తునె యిష్టనీబలం
బును హరి నేర్పుఁ జూచుటకుఁ బోకి వచ్చి నీవు పాండురా
జ నకు జయించి తేనిఁ దెగినా వుశౌర్యము నస్త్రవీర్యముం. ద్రో.ప.

శా. క్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపక్రాంతుండు కర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటణఁచు నీరఁ దాలిచిన్ జిహ్మ య
త్యంతంబుం శశిరత్న మొందినను గోత్రాభులెల్ వడంకాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణునకుం గోల్పాటు వాటిల్లునే క.ప.

చ. చదివితి నెల్లవేదములు జన్నము లొప్పఁగఁ జేసితిం రణా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెఱుఁగ నోర్వఁగంటి దు
ర్మదరిపుగాఢగర్వహరిణోద్ధవకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగుటొప్పదే. శ.ప.

చ. దురమునఁ బెంపుఁ జేసయును దర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచక విశిష్టతలంబునఁ బోరి సద్గతిన్
బొరసెదు నీకు నై వగవు పుట్టదు బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక వారి దిగుదీనత కోర్వక యుమ్మలించెదన్. సౌప.

మంగళమహాశ్రీః:

ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి యును
నెంతయును భక్తిఁ గని వాడుం
బ్రీతి యొసఁగం బలికి ప్రేమ మొలయం బొగడి
పెద్దయు వినీతివిరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టదయ నిమ్మలిన ధర్మం
జేతల ననూనమగు నిద్ధజయ మగు మాతలకు
నెల్లియును సిద్ధమగు నంటికా. స్త్రీ॥ప.

మ. నిజదారైకపరత్వముంగరుణయున్ నిర్లోభమున్ దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సంపద్దార్చనల్ హవ్యపు
గృజనంబున్ సకలాశ్రమస్థులకు శక్తిప్రక్రియం బ్రోవు నం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె సర్వేశ్వరా. శాంప.

చ. అశననిద్రఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షసమనంతరకల్పిత మైనయేకభు
క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనియె మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భూవరా. అప.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తుకొని యొయ్యన మోమలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁడైన పురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం
జిత్తమెలర్పఁగా దనదు చిన్నగ ఫాలము సేర్చెనన్ ముదా
యుత్తమసత్కుఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్. అప.

క. మా యయ్య శాసనమునఁ
బోకొందు సేవితనితోడఁ బోయెద శుశ్రూ
షాకాంక్షనై యుండెద
నీయెడఁ గొనుచు మగిడి యేగుము తల్లీ. ఆ.వ.

చ. వలసిన కొట్టి కార్యమును వారిరి కొట్టఁగనైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరీక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి మొ
క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁడు పేత సేసె నీ
పొలియుటవశ్యభావ్యమని బుద్ధిఁ దలంచుట గాన యయ్యెడుం. మౌ.వ.

చ. తినవు దొఱంగ కిట్లు సుకృతంబుల పెంపున వచ్చితి మ్మనం
బునకు మహాత్మ! యిచ్చటను బోవదు నీమనిఁ జాపి మర్త్యశం
బనుపడియున్న నెయ్యము భాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మమలను సిద్ధులంపగు నెమ్మంచటి చందమునొందియుండఁగన్. మం.ప్ర.

ఉ. భారతమార్గితో విపిన భక్తిఁ బఠించిన శ్రీయు వాయువున్
భూరియశంబునుం బ్రమనమున్ దృఢవీర్యముఁ గల్గు వారికే
కోరిక లైన వేగ మొనఁగూడఁ సువృత్తునిఁ గాంచు సద్గురుల్
గారవ మొప్పఁగాఁ బడయుఁ గల్గిని యుల్ కరుసంపుమారియున్. స్వ.వ.

తిక్కన రచించిన యితర కావ్యములు :

(౧) విజయసేనము.

తిక్కనామాత్యుఁడు విజయసేన మను ప్రబంధమును రచించె నని యొక ప్రతీతి కలదు. ఈ క్రిందిపద్యములు విజయసేనములోనివని పెదపాటి జగ్గనవి సంకలనము చేసిన ప్రబంధరత్నావళిలో నుదాహరించి యున్నాఁడు. ఈ రత్నావళిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులు గారు ప్రకటించియున్నారు. విజయసేనమిప్పు డెచ్చటను గనుపట్టుట లేదు. ఇది యొక ప్రౌఢకావ్యమని చెప్పుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావు గా

రాంధ్రులచరిత్రమున నీ క్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. ఈ పద్యములు వారికెట్లు లభించినవో తెలియదు.

"సీ. ఘనసారకస్తూరికాగంధయుల నవ్య
గంధబంధంబులు గలపి కలపి,
కుసుమితవల్లికాలతికవీథులఁ జొచ్చి
గని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికాహార్యాంగన గీతములతోన
కన్నెతీఁగల గాట కలసి కలసి,
కుముదకహ్లారకోటికోరకంబులు దూఱి
యవిదంపతులఁ బ్రదఁ దెలిపి దెలిపి,

గీ. యనుదినమ్మును నప్పురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నడచిన చెలి వోలె
మెలఁగుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బెంచి వసంతుఁడు కావు గాక సై
రేల్లవనంబు నెంతటను లేదఁగఁ దా రొడికంబు మీఱ న
ట్టిల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బరాగపత్త్రికుల్
త్రుళ్లఁగఁ జేసె నెట్టియుఁ బలుత్వము కాముఁడు పిచ్చలింపగన్."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనిది)

ఉ. అల్లనఁ దోఁకమెత్తి శిఖ నౌవలయేటిజలంబు పుచ్చి సం
పుల్లగఁ బాదపీఠము పొంతన యున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోఁగ సేయు నట్లు తో
ఛిల్లగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్.

శా. గీర్వాణాచలసాను వాత్కరవన క్రీడాహతంబైన న
య్యుర్వీరుంధరియు నంత నంత ఫణరట్స్వోద్వృత్తపృథు లుర్వి దృ
క్పర్వంబై పొదిగట్టి పేర్చిన మదిం గంబంబు యుంచుక్ గన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును పద్మపద్మాగప్రతి
బింబములును తగ జొనసి మెఱయఁ
గల్లోలములును రంగద్భ్రమరాయిత
తుండములును పటు తోఁట్రుపడఁగ,
బిసములు విహారణరసపమాగతరసా
తలనాగ శిశువుల చెలిమి సేయఁ
జక్రియుగ్మంబులు జలకేళిలోలని
తంబినీ స్తనములు తడఁబడంగ

గీ. సాంపుమీఱి చట్టి పెంపును గఁభీర
తయును బరువులోవు వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప సఖులసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల పీఁగుఁజన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
శ్రీవరహస్తకాండపటుపుట్టనలన్ బెఱిఖాతరంగముల్
దిరుగుడు పడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

చ. కొనిరొద మన్మథబందగుణ కోటులకమ్మదు; రమ్యతం బూని తె
ల్చిన పర కొంత పెద్దవెల చెప్పినఁ గొంచఁరు తగంగ నిచ్చి; న
ల్చిన వెలతీర్పు లక్ష్మి తమ చెప్పినయట్టుల చేయు సొంపు పే
ర్చిన గణుతింప రాదు; పురకోమటులం బ్రణుతింప నొప్పదే?

క. కిసలయకరశ్రీబిసబిం
బసుధాంశుప్రాయవస్తు బహువిధరూపో
ల్లసము మద ముడువ నజుఁడొక
యనఘాకృతి దాల్ప నఁగ సంగన యొప్పెన్.

సీ. మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నాఁగ?
సితకరబింబ నిస్సృతసుధాధారౌ వి
తఁటిసీరూపంబు దాల్చె నాఁగ?
విధి కామినీశ్రేష్ఠ శిక్షావదంసీమ
భ సురతను లీలఁ బడసె నాఁగ?
శృంగారనవరస శ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందె నాఁగ

గీ. కాక యొకకథాటికుడుపుఁ బుట్టిన
భామ కేల గుట్టిరామణీయ
కంబు కలుగుననుచుఁ గన్నికపై మహీ
పాలసుతుఁడు దృష్టిఁ గాలవనర్తి.

సీ అరిమానసమ్ములు దరికొనియేర్పు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బంధులజ్ఞానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వని పాండిత్య మొసఁకఁ మెసఁగ?
కొట్టిమాన్యుల నైన నెవ్వానివితరణం
బులు వదిజముల చాపల మొనర్చు?
వనితాజనము మానభంగముఁ గోల్పుచ్చు వి
చ్చలపడి నెవ్వాని విలసనంబు

గీ. అట్టి విజయసేను సభిరామమూర్తి వి
ద్యావిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిధమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసముద్రుఁ డగుట.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల వశీయుంబై పరీక్షించి సన్
ధిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహమునో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దేసం గ్రౌర్యంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైనతి శశ్వచ్ఛ్రీసమేతుండగున్.

క. పరధన పరాంగనాజన
పరిహారము ధర్మపథ మందును స
త్పురుషులు మెఱవక నీకుం
బరికింపుము వినుము మెప్పుడు పైతృప్యంబుల్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృల్లోక
రాష్ట్రదుర్గబల పరాయణులను
నీవు విదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ.

ఈక్రింది సీసపద్యము తిక్కన విజయసేనము లోనిదని శ్రీ
మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మదననిఁ బద్మాత్మకౌస్తుభ మైన
మెఱవక కొనిపోడి మెఱుఁగలిగి
విలువ యిత్పదమని వేఁడినఁ బలిజూప్పుఁ
గమ్మసెంతడియు నమ్మగలిగి
చేవస్తు కొంత ప్రౌఢ్యెండటు చను చెంచి
కొంతటఁ డిగిన నెడురఁ గలిగి

తమయింట లేవిఖర్గము లర్థపతియింట
 నైన వెదకిన లేవనుట గలిగి
గీ. తమకులాచార వర్తన(?)మూ కొలకు
నంగడుల నొప్పునటుచు బేహారిమాట
గాని లాభమునకు గాదనంగ
వలుకుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ ప్రబంధ రత్నావళి పీఠికలో నుదాహరించుచు, పై పద్యములలో నొకటి వైశ్య వర్ణన మున్నది ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయ సేనమందలివే యగునా? యని శంకించినారు. పై పద్యములలో గజపతి స్తోత్రము రెండుపద్యములలో నున్నది. పరిఖావర్ణనము రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమకూర్చుటలో నేదైన పొరపాటు జరిగెనో? లేక తక్కనయే యిట్లు రచించెనో, చెప్పఁ జాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్రమసేనుఁడు. నాయిక విషయము. తిక్కన విజయసేనములోని నాయకుఁడు విజయసేనుఁడు. నాయిక పేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షరములలో రెండవ మూఁడవ యక్షరములు దక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథనామముల నిచ్చుటలో పొరపాటు పడిరోనేమో.

అప్పకవియును, కస్తూరిరంగ కవియును, వీక్రిందిపద్యము విజయ సేనములోనిదని సంశయాస్పద యతికి లక్ష్యముగా నిచ్చియున్నారు,

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూఁది యిమ్మెయిన్
 దల్లడ మందె దేల యుచితస్థితి స్ననుఁబోఁ జూపినన్

